

మన వైస్రాయిగారు

**Our Viceroy**

సంపుటము 3] నవంబరు 1916 [సంచిక 5

# బాలమిత్ర

## మన వైస్రాయిగారు

మన వైస్రాయిగారగు చెలమ్స్ఫోర్డు ప్రభువు గొప్ప విద్వాంసుడు. ఆయన ఒక కళాశాలలో మంచి బహుమతి నొందెను. ఫుట్ బాల్ టీమునకు కెప్టనుగానుండెను. 1893 సంవత్సరమున ప్లీడరు పనిలో ప్రవేశించెను. 1905 నందు ఆస్ట్రేలియాలోని క్వీన్సులండ్ పరగణాకు గౌర్నరుగా నియమింపబడెను. అచ్చట ఎనిమిదేండ్లు పనిజేసి వచ్చిన పిదప లండను కౌంటీ కౌన్సిలునందు సభ్యునిగా జేయబడెను. విద్యాశాఖయందాయన బహుమంచిపనిని జేసెను. యుద్ధారంభమునందు చెలమ్స్ఫోర్డు ప్రభువును ఆయన ముగ్గురు అన్నదమ్ములును సైన్యమునందు జేరిరి. గాన మన వైస్రాయిగారు, లాయరును, ఉపాధ్యాయుడును, న్యాయాధిపతియు, సిఫాయియునై యున్నాడు. ఆయన అన్ని విషయములలో మంచివాడని పేరుబొంది వెళ్లిన అన్ని చోట్లలోను ప్రేమకును మన్ననలకు బాత్రులగుచున్నారు. ఆయన శక్తి సామర్థ్యములు గలిగి స్థిరబుద్ధియు దృఢచిత్తమును గలవారై యున్నారు. చెలమ్స్ఫోర్డు ప్రభ్వీగారుకూడ వారి వెంటనేవచ్చి హార్డింజ్

ప్రభువుగారివలెనే జనుల హృదయములను ఆకర్షించి జనులచే ప్రేమింపబడును గాక.

---

## "విక్టోరియా క్రాస్"




విక్టోరియా క్రాస్ అనునది ఒక పతకము. ఇది కంచుతో జేయుబడినది. శిలువాకారముగా నుండును. దీని యంత గౌరవనీయమైనది మరియొకటి లోకమందులేదు. దీనిపై «శౌర్యము జూపినందులకు» అని అర్థమిచ్చు పదము లుండును. కీర్తిశేషురాలైన విక్టోరియా రాణిగారిచే 1856 సంవత్సరమున నేర్పాటు చేయుబడినది. దేశము నిమిత్తమై

శత్రుమధ్యమున చేయబడిన పరాక్రమ కార్యము కొరకును, దేశభక్తి కొరకును ఈ పతకమునిత్తురు. ఈ పతకము నొందిన వాడు సైన్యమునం దుద్యోగియైనను, సాధారణ సిఫాయి యైనను, సైన్యసంబంధపు గౌరవమున కర్హుడైయున్నాడు. దీని ఖరీదు కొన్ని అణాలు మాత్రమేగాని, ఒకని కెన్ని ఇతర పతకములున్నను, ఇది మొదటిదిగాను, ఘనమైనదిగా నెన్నబడును. దీనిని ధరించువా రతిశయాస్పదులని చెప్ప వచ్చును.

పతకములోనున్న యాకారమును గలిగి ఒకటిన్నర అంగుళము వెడల్పుండును. ఆంగ్లేయులచే పట్టుకొనబడిన ఫిరంగులు చేయబడిన కంచు లోహముతో వీని జేతురు. దాని నెడమ భుజముపై ధరింతురు. నావికులకు దానిని నీలిరంగు పట్టు పేలికతో కట్టుదురు. సిఫాయి యైనయెడల యెఱ్ఱపట్టుపేలికతో కట్టుదురు. సివిలియనులును దీనిని పొందవచ్చును.

కమిషనుద్యోగికి దిగువ వాడైనయెడల సంవత్సరమునకు 10 పౌనులు యిత్తురు. అట్టి సాహసకార్యము మరియొకటి జేసినయెడల దానికొక కొక్కెము తగిలించి సంవత్సరమున కింకా 5 పౌనులిత్తురు. ఇట్టి విక్టోరియా పతకములు యుద్ధమునందు ప్రాణమును రక్షించుటలో శూరత్వము నగుపర్చినవారికే ఎక్కువ ఇయ్యబడుచున్నవి.

-------

# ప్రకృతి పాఠములు

## 27-వ పాఠము

## మెదడు, నాడులు

(గతపాఠ శేషము)

మెదడు తంతి ఆఫీసువలెనుండి నాడులను తీగెలద్వారా ఉత్తర ప్రత్యుత్తరమును జరుపుచున్నదని పోయిన నెలలో నేర్చుకొనియుంటిమి. మీకందర కది జ్ఞాపక మున్నదని నమ్ముచున్నాను.

ఒక తరహా నాడులద్వారా మెదడు సమాచారములను దేహముయొక్క ప్రతిభాగమునకు పంపుచున్నది. మరియొక తరహా నాడులద్వారా శరీరముయొక్క అన్ని ప్రదేశములనుండి కబురులు కనుగొనుచున్నది. ఇదెట్లు జరుగుచున్నదో కొంచెము నిదానించి చూడుము. ఏదైన ఒక వస్తువును తాకుము. నీ మెదడులోనున్న మనస్సునకు అదెట్లున్నదో ఏలాగు తెలియును? గట్టిగా నున్నదా, మెత్తగా నున్నదా, గరుకుగా నున్నదా లేక నున్నగా నున్నదాయని ఏలాగు గుర్తెరుగును? ఈ సంగతిని తెలిసికొనుటకు తలలో నున్న మనస్సు చేతివ్రేళ్లయొద్దకు బోయినదా? లేదు. మెదడునుండి చేతివఱకు వ్యాపించియున్న నాడులద్వారా

మనస్సు తెలిసికొనుచున్నది. దేనినైనా ముట్టుకొన్న తత్క్షణమే, నాడులద్వారా మెదడునకు ఏదోయొకటి మెరుపు కంటె వడిగాబోవు నీవు ముట్టుకొన్న దేలాటిదో, మనస్సునకు తెలుపును. అదేలాగున నీవు దేనినైనా వాసన చూచినప్పుడు, నీ ముక్కును మెదడుతో కలుపు నాడులు ఆవస్తువు వాసన యెట్టిదో మనస్సునకు తెలియజేయును. దేనినైనా తినినప్పుడు నోటిలోని నాడులు, ఆవస్తువు చేదో, తీపో, పులుపో, మనసునకు తెలుపును. దేనినైనా చూచునప్పుడుగాని వినునప్పుడుగాని ఇదేలాగు కంటిలోను చెవిలో నున్న నాడులు మెదడుకు కబురు తీసికొనిపోవును.

మనస్సునకు నివాసస్థానమగు మెదడు శరీరమంతటిలో



బహుమెత్తని పదార్థమై యున్నది. కోడిలేక మేకతలలోని మెదడును అప్పుడప్పుడు చూడవచ్చును. దానిని చేతితో పట్టుకొన్నయెడల ఎంతో మృదువుగానుండును. తంతి ఆఫీసులోని కొన్ని తీగెలు మాత్రమున్నవిగాని నీ శరీరమంతట వ్యాపించియున్న నాడులు లెక్కపెట్ట వీలు లేనంత ఎక్కువగా నున్నవి. ముఖమునుండియు, తలనుండియు బయలుదేరిపోవునాడు లీ పైపటములో నున్నవి చూడుడు.

ఇదేలాగున దేహమంతటిలోను లెక్కపెట్ట వీలులేనంత విస్తారముగా నున్నవి. ఇవి పోనుపోను బహుసన్నగా నగుచు శరీరమంతయు వ్యాపించియున్నవి. ఎక్కడనైనా ఒకచోట సూదిమొనతో పొడిచినయెడల అక్కడనున్న నాడులు ఎంత చిన్నవిగా నున్నను వెంటనే మెదడుకు కబురుపంపును. నాడుల పుట్టుకస్థలము మెదడే. మెత్తగానున్న ఈ పదార్థముతో నాడులన్నియు కట్టలు కట్టలుగాచేరి, మెదడు వానినన్నిటిని ఉపయోగించుటకు వీలగునట్లుగా నున్నవి. తంతి ఆఫీసులోని మనుష్యునివలె మనస్సు తన స్థానములో సిద్ధముగానుండును. కట్టలుగానున్న నాడుల చివరనుండి శరీరముయొక్క యితర ప్రదేశములో జరుగు దానినంతటిని తెలిసికొనుచుండును.

మనస్సు చేయువలసినపని యెంత గొప్పదైనను, ఎన్ని వార్తలు వచ్చుచున్నను మనస్సెంతమాత్రము పొరపాటు పడదు. వచ్చువార్తలన్నియు ఎచ్చటనుండి వచ్చుచున్నవో దానికి బాగుగా తెలియును. వ్రేలునుండివచ్చిన వార్తనువిని, కాలునుండివచ్చిన వార్తయని పొరపాటుపడదు. అదేలాగున ఎచ్చటికే వార్త పంపించవలెనో ఆవార్తను సరిగా ఆస్థలమునకే పంపునుగాని, కాలుకు పంపవలసినది చెవికిగాని, చేతికి పంపవలసినది ముక్కుకుగాని ఎన్నటికి పంపదు. ఇదేలాగు శరీరమందలి అన్ని భాగములతోను ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండును. నీవు కదలించు ప్రతి అవయవము

తోను ఈపని జరుగుచునే యుండును. ఎవడైనను వాయించు నప్పుడుగాని నాట్యమాడునప్పుడుగాని నీవు లక్షించు సమయ మున ఈ కబురులు మెదడునుండి దేహముయొక్క ఆయా భాగముల కెంతవడిగా బోవునో దానినిగూర్చి కొంచె మాలోచించిన యెడల ఎంత వింతైనను కలుగును. దీనిని గూర్చి మరియొక పాఠములో చెప్పెదను. తంతి ఆఫీసులోని వాడు ఏతీగతో కబురులు తెలిసికొనునో ఆ తీగతోనే కబు రులు చేయును. గాని మెదడు అలాగుకాదు. కబురులు తెలిసికొనుట కొకమాదిరి నాడులును, కబురులు పంపుటకు మరియొక మాదిరి నాడులునుగలవు. నీవ్రేలు కాలినయెడల వెంటనే దానిని కాలిన స్థలమునుండి తీసెదవుగదా? వ్రేలు కాలినదని కబురు వ్రేలునుండి మెదడుకు వచ్చినది. వెంటనే ఆ స్థలమునుండి వ్రేలును తీసివేయుమని మెదడు కబురు చేయును. ఆప్రకారమే జరుగును. మనస్సుకు తెలియుట అనునది ఒక తరహా నాడులవలన జరిగినది. ఆవ్రేలు నా స్థలమునుండి తీసివేయుమను కబురు చేతియందలి కండర ములకు వచ్చినది.

ఇది యంతయు బహువింతగా జరుగుటలేదా?



# భూమినుండి సూర్యుని కెంతదూరము?



ఈ సృష్టియందు మన భూమికిని యితర లోకములకు నెంతదూరమో సాధారణముగా నెవరును ఊహించుకొనరు. సూర్యుడు మనకు తొమ్మిదికోట్ల ముప్పై లక్షల మైళ్లదూరమున నున్నాడనినయెడల ఎంత అని అనుకొనుచున్నారు?

గంటకు 60 మైళ్ల వేగముతో బోవు ఒక మెయిలుబండి దివారాత్రులు ఆగకుండ పోయినయెడల సూర్యుని జేరుటకు 177 సంవత్సరములు పట్టును. ఇంగ్లాండు రాజగు రెండవ జార్జి కాలమున అనగా 1737 సంవత్సరమున ఆరంభించిన యెడల, అది మూడవ జార్జి, నాల్గవ జార్జి, నాల్గవ విల్లియమ్,

విక్టోరియా రాణి, ఏడవ ఎడ్వర్డు చక్రవర్తికాలమంతా నడచుచు, ఐదవ జార్జి చక్రవర్తిగారి కాలములోకూడా పోవుచునే ఉండును. లోకములో ఆకాలము గడచునప్పటికి ఆరుతరములు గతించును. భూమినుంచి సూర్యునివద్దకు అంత అనుకొంటే, సూర్యునినుండి నెప్ట్యూను అను గ్రహమునకు ఇంకా ముప్పయిరెట్లకాలము పట్టును!

---

# బైబిలు పిల్లలు

## మిర్యాము

చాల వందల సంవత్సరముల క్రిందట యూదులు ఐగుప్తు దేశములో బానిసలుగా నుండిరి. వారి పితామహుడగు యాకోబును అతని సంతానము అందరును కలిసి డెబ్బదిమంది కానాను దేశములో కలిగిన కరువు బాధను తప్పించుకొనుటకు ఐగుప్తుకు బోయిరి. ఆ దేశములో నైలు నది ప్రవహించుచున్నది. ఈ నదివలన ఐగుప్తు మిగుల ఫలవంతమైనదేశమై చుట్టుప్రక్కలనున్న యితర దేశీయులకు ధాన్యపుకొట్టుగా నుండెను. పశువులకాపరులౌ ఇశ్రాయేలు పుత్రులు ఐగుప్తుదేశపు ఫలమును చవిజూచినప్పుడు మరల తమదేశమునకు రానొల్లకపోయిరి. యోసేపు సిఫారసుపైన

వారికి గోషేనను ఫలవంత ప్రదేశము దొరికినందున కానాను దేశమునుగూర్చి కలనైనను దలంచరైరి. కలిమియున్నంత కాలము కడుపేగదా దేవుఁడు?

కష్టకాలము వచ్చెను. ఎప్పుడును వెన్నెలయే యుండునా? యోసేపు ఐగుప్తుకు జేసినమేలును మరువజాలనివా రున్నంత సేపు సుఖముగానే కాలము గడచెను. క్రొత్తజాతివారు అధికారమునకు రాగానే వీరినెత్తిమీదికెక్కిరి. వీరంటేనే తుమతుమలాడిరి. వీరిని నాశముచేయుటకు తాము చేయ గలుగనన్నికష్టముల బెట్టిరి. ఇటుకలు జేయించిరి. పుర ములు కట్టించిరి తిట్టిరి కొట్టిరి. కడగండ్లబెట్టిరి. గాని లాభ మేమియు లేకపోయెను. పుట్టిన మగపిల్లలను పుట్టినట్లే చంపు టకు మంత్రసానులకు లంచములిచ్చిరి. వారుమాత్రము స్త్రీలుకారా? ఎంతమందిని చంపెదరు. ఒకరినా ఇద్దరినా? ఒక జనాంగమంతటిలోని పసిపిల్లలను చంపుట కెవరిప్రాణము లొప్పును? దానివలనను లాభములేదాయెను. రాజుకు రాజు ఆలోచనకర్తలకు, భయముపుట్టెను. తామెంతగా వీరిని నాశముచేయదలంచిరో అంతకు రెండురెట్లు నాలుగు రెట్లు, పది, పన్నెండు, ఇరువైరెట్లు వీరు వృద్ధినొందిరి. దైవా శీర్వాదమున్నవారి నెవరు దండించగలరు? చివర కొక ఆజ్ఞ నిచ్చిరి. పుట్టిన మగపిల్లలనందరిని నైలునదిలో బడవేయ వలెనని, దీనిని మీరినవారికి రాజుగారి యాజ్ఞయవును.

అదిగో అట్టిసమయములోనే పుట్టినది మిరియమ్మ. కుటుంబములో పెద్దకూతురు. ఆడపిల్లయైనందున తల్లిదండ్రులకు దక్కెను. ఈమె తల్లిదండ్రులు దైవభక్తులు. తక్కిన వారిలో ననేకులు విసుకుజెంది దేవుని మరచిరి. విగ్రహములను పూజించ పాల్పడిరి. గాని వీరు దేవుని దృష్టిలో నిష్కళంకులు. తమ బిడ్డను నీతిమార్గములో నడిపిరి.

మిరియమ్మ కేడెనిమిది సంవత్సరముల ప్రాయమువచ్చెను. అప్పుడామెయింటికి మరియొక బిడ్డడువచ్చెను. వాడుచూడ చక్కనిసుందరుడు. వీడే మన మిదివరకు చదివిన మోషే. మిర్యాము సంతోషమునకు మితమేలేదు. గాని ఎందుచేతనో తండ్రియు తల్లియు సంతోషసుఖముతో నుండుట ఆమె చూడలేదు. దినము గడిచినకొలది అణుమాత్రము ఆహారము ముట్టుట మానెను. యోకెబెతు యోచనపరురాలాయెను. మిర్యామున కిదియంతయు చిత్రముగా నుండెను. పాపము తన చిన్నితమ్ముడు నైలునదీపాలగునని ఆమెకెట్లు తెలియును? తల్లిదండ్రులు ఒకరినిజూచి మరొకరు కంటికి కడివెడుగార్చుచుండిరి.

తల్లి ఒకనాడు మిర్యామును వెంటబెట్టుకొని నెత్తిపై నొక గంపనుంచుకొని యేటికి దీసికొనిపోయెను. చాకిరేవుకేమో నని మిరియమనుకొనెను. నదికి వారు స్నానమునకును, చాకిరేవుకువెళ్లుట వాడుక. పోయిపోయి తల్లి తప్పుదోవ

తీయుచున్నట్లు గుర్తించెను. “అమ్మా దోవిదికాదే” యనెను మిర్యాము. “మాట్లాడక నావెంట బిరబిర రమ్ము”నెను తల్లి. చివరకు వారు జనసంచార మంతగాలేని ప్రదేశము జేరిరి. తల్లి గంపలోని బట్టలనెత్తి బైటవేసెను. బిడ్డను బైటకుదీసి కడుపునిండ పాలిచ్చెను. ఆహా! ఆ సమయమున ఆ తల్లిని చూచితీరవలెను. అంత చక్కనిబిడ్డను గన్నతల్లిని రాజాజ్ఞ ఎంత కలవరపెట్టెనో. తల్లి పాలిచ్చుచుండగా మిర్యాము మాటిమాటికి తమ్ముని చేతినిపట్టుకొని ముద్దుపెట్టుచు మురియుచుండెను. బిడ్డకు కడుపునిండినది. పాలతేపువచ్చెను. తల్లి ముఖము దుఃఖముతో నిండెను. ప్రేమచూపులతో నిండియుండిన యామె కేమియు కానరాకుండ నీరుగ్రమ్మెను. బిడ్డనెత్తుకొని దిగ్గున లేచెను. నదిలో పడవేయ బోవుచున్నదా యేమి? లేదులేదు. ఎట్లు వేయగలదు? అసాధ్యము.

తాను తెచ్చిన జమ్ముపెట్టెలో బిడ్డనుంచి నీటిచే గొట్టుకొని పోకుండ జమ్ముమధ్య దానిపెట్టెను. మిర్యామునకు అప్పుడు తమ్ముని సంగతిని, రాజాజ్ఞనుగూర్చి వివరముగా తెలిపెను. మిర్యాము ముఖము తెల్లబోయెను. గాని తల్లి, మిర్యాము తమ్మునికెట్లు సహాయపడగలదో చెప్పెను. ఒంటరిగా మిరియు మక్కడకు కొంచెము దూరముగా నుండుటకు ఒప్పుకొనెనా? సంతోషముతో తమ్మునికొరకై తన ప్రాణమిచ్చుటకును సిద్ధముగా నుండెను. ఆ పెట్టెవైపు చూచి చూడనట్లును వేరే

పనిమీద నున్నట్లును ఆడుకొనుచుండెను. బిడ్డ పాలకేడ్చి నప్పుడుగాని, ఇతరు లెవరైనవచ్చి బిడ్డను కనుగొన్నప్పుడుగాని మిర్యాము వెంటనే తల్లికి కబురుచేయవలసి యుండెను.

సాయంకాలమాయెను. చల్లనిగాలి నదిపైనుండి గొట్టుచు పనిచే బడలిక నొందియున్న వారికి హాయిగొలుపుటకు మెల్లగా వీచుచుండెను. ఈలోగా తల్లివచ్చి ఒకమారు బిడ్డకు పాలిచ్చి భద్రమనిచెప్పి తిరుగా వెళ్లెను. మిరియముకు విసుకుపుట్టి లేదు తమ్ముని నెప్పుడు ఎత్తుకొని ముద్దులాడుదునా యని తలంచుచుండెను. ఆమె తలంపు లెంతో దూరము పోయెను. వాటివెంట మనము పోలేము. గాన తిరిగి జమ్ముపెట్టె యొద్దకు వత్తము.

ఎవరా పెట్టెయొద్ద నున్నది? జమ్ముపెట్టె తల్లిపెట్టిన స్థలమున లేదు. ఒడ్డుకువచ్చినది. తెచ్చినదెవరు? మిరియ మేమిచేయుచున్నది? పెట్టెవైపు తిరిగినది. దిగ్గున లేచినది. సమీపించెను. వారి ముఖము లెందుకంత ఆశ్చర్యముతో నున్నవి? వారిమధ్య ధగధగమెరియు నగలనుపెట్టుకొని గంభీరముగా నిలువబడియున్న ఆమె ఎవరు? తెలియునా? మోషేకథ చదివియుంటివా తెలిసికొనియుందువు.

మిర్యాము తెలివిగలది. సూక్ష్మగ్రాహి. ఆమె ఫరోరాజు కూతురని గుర్తించెను. ఆమె ముఖమును లక్షించిచూచి తన తమ్మునియందామెకు అత్యంతాదరము కలిగెనని తెలిసి

కొనెను. ఇంతలో తమ్ముని కేక వినబడెను. తల్లి పాలిచ్చి సుమారు మూడునాలుగు గంటలైనది. వెనుకకుపోయి తల్లిని పిలువ నెంచెనుగాని తల్లియెట్లు ఫరోకూతురును సమీపించ గలదు? తమ్ముడు తనకు దక్కునా? వా రాడుకొను మాటలు వినవచ్చెను. ఏమని? "పాపము. ఆకలియై యేడ్చు చున్నాడు. పాలిచ్చిన బాగుండును?" మిరియమ్మకు బలేసందు చిక్కినది. తా నెవరో అయినట్లును, దోవను పోవుచు వినినట్లు, దగ్గరకువచ్చెను. వారికొక మంచిమాట చెప్పెను.

"సమయోచితముగ పలుకబడినమాట
చిత్రమైన వెండిపళ్లెములో నుంచబడిన
బంగారుపండ్లవంటిది."

సశేషము

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

నేను మీతో మా బడివిషయమై కొన్ని సంగతులను ముచ్చటింప గోరు చున్నాను. మా ఎస్. పి. జి. తెలుగు మిషనులో అక్కడక్కడ ఆడపిల్లలకు చిన్నచిన్న పాఠశాలలున్నవి. మేము దానిలో విద్యనేర్చుకొను చున్నాము. కొన్ని సంవత్సరములకు ముందు సీమదేశమునుండి ముగ్గురు మిశనమ్మ గార్లు ఈ దేశమునకు వచ్చిరి.

వారువచ్చి యిక్కడ ఒక బడిని కట్టించిరి. దానిని కట్టినతరువాత ఆడపిల్లలలో కొందరిని ఈ బడికి చేర్చిరి. ఇక్కడ ప్రస్తుతము 2-వ తరగతి




నుంచి 7-వ తరగతివరకున్నది. ఇది చాల సొగసైనదికాదు. ఐనను మేము నిండుసంతోషము సౌఖ్యముగలవారమై దానిలో నివసించి విద్య నేర్చుకొనుచున్నాము. ఈ పాఠశాలలో కొన్ని సంవత్సరములనుంచి చదువుకొనుచున్నాము.

మిశమ్మగార్లు ఇప్పుడు ఒక కట్టడమును యిక్కడ కట్టించునట్లు ఏర్పాట్లు చేసిరి. ఆ బడి అందమైనదిగాను విశాలమైనదిగా నుండునని నమ్ముచున్నాము. ఆ పాఠశాలకు 1916 సం|| 8 నెల 7 తేది సోమవారమున పునాదిరాయిని డోర్నకల్ బిషపులవారివలన వేయబడినది. ఆ దినమున ఉదయప్రార్థన కాగానే మేము ఇక్కడనున్న స్త్రీలును, పురుషులును కాలేజి మొగపిల్లలును మా మిశమ్మగారును, గురువులవారును అక్కడికి ఊరేగింపుతో పోతిమి. మా అందరికంటె ముందు పరిశుద్ధ శిలువను ఒక

కాలేజి పిల్లవాడు పట్టుకొనివచ్చెను. అక్కడ ప్రార్థనలు చిన్న ప్రసంగము చేయబడెను. ఆదివారము రాత్రియంతయు ఎక్కువ వర్షము కురిసియుండెను గాని దేవుని దయవల్ల ఆ దినమున వర్షము కురియనందున మాకు సంతోషముగా నుండెను. ఆ దినమున మాకు సెలవుగా నుండెను.

మా మిశమ్మగారు మా శరీరనిమిత్తమే కాకుండా మా ఆత్మలనిమిత్తము కూడా శ్రద్ధతీసికొనుచున్నారు. మాకు యింటివద్దర నుండుటకంటే బడిలో నుండుట సంతోషముగా నున్నది. ఎందుకనగా బడిలోనుండుటవల్ల విద్య, బుద్ధి, తెలివి, జ్ఞానము, మర్యాద మొదలగువాని నన్నిటిని చక్కగా నేర్చుకొనుచున్నాము. మా టీచర్లును, మేట్రనమ్మగార్లున్ను మాకు కావలసిన బుద్ధి నీతులను ప్రేమతో నేర్పుదురు.

ఇంకా స్త్రీలకు కూటములు పెట్టుటవల్ల చాల మేలుకలుగుచున్నవి. అన్యులకు సువార్త ప్రకటించుటకు ఏర్పాట్లున్ను, మా బడిలో చదువు ముగింపుచేసినవారిలో కొందరిని నర్సులుగాను టీచర్లుగాను తరిబీతు చేయుటకు పంపించియున్నారు. మా మిశమ్మగారు మమ్ములను ప్రేమతోను, దయతోను పెంచుచున్నారు. ఇట్టి మనస్సును దేవుడే వారికనుగ్రహించెను. ఇట్టి మేలులను మాకు నేర్పుటకు మిశమ్మగారి మనస్సులను ప్రేరేపించిన దేవునికి పిల్లలమైన మేమందరము కృతజ్ఞతగలవారమై యున్నాము. ఆయనకు కృతజ్ఞత స్తుతులను చెల్లించుటకు బాధ్యులమై యున్నాము.

ఇట్లు

జ్ఞానభరణము జ్ఞానశిరోమణి,

7-వ తరగతి,

నంద్యాల్

C. L. S. PRESS, MADRAS—1916